# సమాలోచన



## జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక

సంపాదకుడు: విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి.

సంపుటము 1 రాజమహేంద్రవరము 16-3-1978 సంచిక 10





1, 16 తేదీలలో ప్రచురింపబడును.

చందా

సంవత్సరమునకు రు 10-00.

అర్ధసంవత్సరమునకు రు 5-50.

విడిప్రతి 50 పై.



## —* ఈ సంచికలో *—



రచయితలకు

1—4—78 సంచికలో మనోవైజ్ఞానిక నవల-3, తిక్కన దర్శించి యిచ్చిన సమన్వయం, రెండు కవితలూ - ఒకే ఆశయం మొ॥ ఉంటాయి.


అడ్రసు :—

సంపాదకుడు, **బులుసు సీతారామశాస్త్రి,**

**Retired Telugu Lecturer, V. T. J. College,**

6-8-7, ఇన్నీసుపేట (త్యాగరాజ నగర్), రాజమండ్రి-1.


---





# నవ్యకవిత్వము - ప్రకృతిస్ఫురణ

డా॥ జి. వి. ఎస్. ఆచార్య, ఎం.ఏ., పిహెచ్.డి.
తెలుగుశాఖ - ఆంధ్రవిశ్వవిద్యాలయము.

జడవస్తువును రసమయ మొనరించి చైతన్యభిక్ష పెట్టునదే కవిత్వము. కవిత్వ సంపుటము కావ్యము. మర్త్యులను అమర్త్యులనుగా చేయునదే కవిత. అంధకార బంధురమైన జీవితములో కావ్యదీప్తి అత్యంతావశ్యకము.

"ఇద మంధం తమః కృత్స్నం జాయేత
భువనత్రయం, యది శబ్దాహ్వయం జ్యోతి
రాసంసారం న దీప్యతే"

అని కావ్యాదర్శకారుడు దండి. శబ్దమను కాంతివిశేషము ప్రసారము చేయకుండ లేకపోయినచో ఈ ముల్లోకములును పూర్తిగా అంధకారావృతములై యుండెడివని దండి భావము. ఈ కావ్యము సప్తసంతానములలో ఒకటి. (జక్కన్న, శ్రీనాథుని భీమేశ్వరపురాణములలో మాత్రము). పల్లలమర్రి పినవీరభద్రుడు, గౌరన, శంకరకవి, దోనూరి కోనేరునాథకవి, మాదయ్యకవి, అల్లసాని పెద్దన, అయ్యలరాజు రామభద్రకవి, భానుకవి, ఉత్తనూరి పాపకవి, కృష్ణకవి మొదలైన ప్రాచీన కవులెందరో సప్తసంతానములలో 'కృతి' మిన్న అనియు, అకల్పమైన కీర్తి ప్రతిష్ఠలను కలిగించుననియు తమ కావ్యావతారికలలో తెలిపియున్నారు. కవికిని, కృతికిని విచ్ఛేదము లేదనియు, కృతియే కీర్తిసదన మనియు పూర్వులఅభిప్రాయము.

ఈ సంసారము అనే విషవృక్షమునకు అమృతోపమానమైన రెండేరెండు ఫలములు కలవు. అవి 1) సజ్జనసల్లాపము 2) కావ్యామృతరసాస్వాదము. అమంగళ పరిహారకమైన శక్తి కలిగినదియును, సద్యః పరనిర్వృతిని కలిగించునదియును, సత్కావ్యము. పూర్వకవులు సాధారణముగా మహాకావ్యములను రచించినారు. కవులు, కావ్యములు పూర్వము విశేషముగా పోషింపబడుచుండెను. రాజులు, ప్రజలు కూడ దోహదము చేసియున్నారు. తరువాత తరువాత పరిస్థితులు మారినవి. కవులను కావ్యములను పోషించు శక్తిగల రాజులు, కావ్యములను ఓపికగా చదివి ఆదరించగల ప్రజలు, కనుమరుగైనారు. మహాకావ్యరచన సన్నగిల్లి, రాను రాను, పూర్తిగా మానివేయబడినది.

నవ్యతాప్రీతి మానవుని సహజప్రవృత్తి. నవ్యత రమణీయతాస్వరూపము.

"క్షణే క్షణే యన్నవతా ముపైతి
తదేవ రూపం రమణీయతాయాః"

(మాఘుడు - శిశుపాలవధ)

అన్నట్లు ప్రతిక్షణ నవ్యతయే లోకమును రసమయము చేయును. ఈ నవ్యత సమాజములో సాహిత్య, సాంఘికాది రంగములందు కనిపించును. కావ్యలక్షణములన్నియు లేకపోయినను, స్వయం సంపూర్ణమై, పూర్వాపరనిరాకాంక్షమై,

పరిసమాప్త్యర్థకమై, రసపర్యవసాయి కాగలిగిన కావ్యైకదేశము "ఖండకావ్యము" అను పేరుతో నవ్యసాహిత్యములో సముచిత స్థానమును పొందియున్నది. ఈ ప్రక్రియ మనకు క్రొత్తది కాకపోయినప్పటికిని, పాశ్చాత్యప్రభావము వలననే ననలుకొనలు సాగినదని చెప్పవచ్చును. ఖండకావ్యరచనా వ్యాప్తికి మూలపురుషుడు "గురజాడ అప్పారావు". ఇంచుమించు 1905 ప్రాంతములో నాటకరచనతో పాటు ఖండకావ్యరచనకుకూడ శ్రీకారము చుట్టినాడు. తరువాత "రాయప్రోలు, కృష్ణశాస్త్రి, విశ్వనాథ, తుమ్మల, కొడాలి, జాషువా, కవికొండల, దువ్వూరిరామిరెడ్డి" మున్నగు కవిశేఖరులు పేర్కొనదగినవారు. పద్యరచయితలే కాక, గేయరచయితలు, వచన కవితల రచయితలు అసంఖ్యాకులు బయలుదేరి నవ్యాంధ్ర సాహిత్యక్షేత్రములో రాశియందును, వాసియందును గణనీయమైన కవితాసస్యమును పండించుచున్నారు.

నేటికవులు సహజసౌందర్యప్రియులు. మానవసమాజము కాలానుసారముగా మార్పుచెందుచుండును. సాహిత్యము సమాజముయొక్క ప్రతిబింబము. కనుక ఆయాకాలములందలి సమాజముల ఆచారవ్యవహారములను కవి తన కావ్యములో చిత్రించుట జరుగుచున్నది. రచనావిధానములో మార్పులు సంభవించినప్పటికిని కవికి లోకమే ప్రమాణము. ప్రకృతిసౌందర్యవర్ణనము, మానవస్వభావ చిత్రణము కవికి ముఖ్యమైన విషయములు. పూర్వకవులకు ప్రకృతి వర్ణన ప్రత్యేకమైన అంశముకాదు. సందర్భానుసారముగా ఎడనెడ ప్రకృతిని వర్ణించి విడిచెడివారు. కాని నేటి కవులకు ప్రకృతి వర్ణన ప్రత్యేకమైన అంశము. బుద్ధిపూర్వకముగా కావ్యములను, ఖండికలను ప్రకృతి వర్ణనాత్మకములుగా వ్రాయుచున్నారు.

ఆంగ్లసాహిత్య ప్రభావముతో ప్రకృతి కవిత్వము నేటి మనకవులకు అత్యంత అభిమానమైన అంశముగా పరిణమించినది. ఆంగ్లమందలి భావకవులలో "బైరను, షెల్లీ, కీట్సు, వర్డ్సువర్తు"లు ముఖ్యులు. వీరిలో ప్రకృతి కవిత్వమునకు సంబంధించినంతవరకు "వర్డ్సువర్తు"కు విశిష్టస్థానము లభించినది. "Nature is the Goddess of poets" (కవులకు ప్రకృతి ఆరాధ్యదేవత) అని పలికిన వర్డ్సువర్తు మన కవులకు బహుధా మార్గదర్శి అయినాడు. ఆధునిక కవులు స్వాభావికముగానే కట్టుబాట్లనుండి కడుదూరముగా తొలగినారు. నాయికానాయకులు లేకయే ప్రకృతి వర్ణనను చేసినారు. ప్రొద్దుపొడుపులు, మునిమాపులు, సెలయేళ్లు, వనములు, కొండలు, మేఘములు, చంద్రోదయము మొదలైన మనోహరదృశ్యములతోకూడిన బాహ్యప్రకృతి కవికి వర్ణనీయమైనది. ఆంగ్లకవుల "Lake Poetry Nature Poetry" ఈ కోవకు చెందినవి.

'ప్రకృతికిన్ భాష్యప్రణేతల్ కవుల్' అనువాక్యానుసారము మహాకవులు ప్రకృతిలోని రహస్యములను సుమధురవాగ్గుంభనములతో వివరించి విస్పష్టము చేయుచుందురు. సర్వశక్తిమంతుడును, ఆది

మధ్యాంతరహితుడును అయిన పరమాత్మ తన శక్తు లన్నిటిని ప్రకృతి ముఖమున ప్రకటించును. దీని నే 'వ్యక్తవస్తు' "Gods Mysterious powers made Manifest in Nature's sovereignty' అని నుడివినారు.

కవితావతరణమే ప్రకృతి వర్ణనలతో ప్రారంభమైనదని విజ్ఞుల అభిప్రాయము. ఋగ్వేదములోని ఉషస్సూక్తములో నిసర్గరమ్యమైన ప్రకృతి వర్ణన లున్నట్లు తెలియుచున్నది. ఆదికావ్యమైన వాల్మీకి రామాయణము ప్రకృతివర్ణన తోడనే ఆవిర్భవించినట్లు మనకు విదితమైన విషయము. నవ్యకవిత్వాంపలి ప్రకృతిని గూర్చి వివరించుటకు ముందు 'ప్రకృతి' శబ్ద వివారము చేయుట సమంజసము.

శ్రీమద్భగవద్గీతా వచనానుసారము దృశ్యమానమైన స్థావరజంగమాత్మక జగత్తు అంతయు ప్రకృతి. ఈప్రకృతికి జీవుడు వశుడు. కాని పరమాత్మకు ప్రకృతి వశంవద. "మాయాంతు ప్రకృతింవిద్ధిమాయినంతు మహేశ్వరమ్" అను శ్రుతివాక్యము ఈ యర్థమునే సూచించుచున్నది. ప్రకృతి జడము. పరమాత్మ చైతన్యస్వరూపుడు. పరమాత్మ సన్నిధాన మహిమచే ప్రకృతి చరాచర ప్రపంచ మంతయు సృజింపబడుచున్నది. ప్రకృతి మాయ, మూలము, బంధము, అవ్యక్తము అనబడుచున్నది. ఈమాయవలననే మనోబుద్ధీంద్రియాదుల వికారములు, సత్వరజస్తమోగుణములు, కలుగుచున్నవి. ప్రకృతియందున్నవాడై జీవుడు, ప్రకృతివలన జనించు సుఖదుఃఖాదులను అనుభవించుచున్నాడు. ఆయాగుణములతోడి కూడికయే జీవుడు ఉత్తమ, నికృష్టజన్మ లెత్తుటకు హేతువగుచున్నది.

"పురుషః ప్రకృతిస్థో హి భుంక్తే ప్రకృతిజాన్ గుణాన్, కారణంగుణసంగోఽస్య సదసద్యోనిజన్మసు."

మానియర్ - విల్యమ్స్ సంస్కృత - ఆంగ్లకోశమున ప్రకృతి నిర్వచన మీవిధముగా నున్నది.

"Prakriti opposite to Vikriti. The original producer of (or rather passive power of creating) the material world consisting of three constituent essences or gunas called Sattwa Rajas, and Tamas; 8 producers of primary essences which evolve the whole visible world."

ప్రకృతి దర్శనముతో కవికి కలిగిన అనుభూతి స్పందనమే కవిత్వరూపము నొందును. చర్మచక్షువునకు గోచరించు ప్రకృతి మనోనేత్రముతో భగవానుని లీలలను గుర్తింప జేయగలుగు చున్నది. ప్రకృతి ప్రత్యణువులో భగవత్తత్త్వము ప్రతిపాదితమై యున్నది. "అణోరణీయాన్ మహతోమహీయాన్". ప్రకృతి ఈరీతిగా మానవునకు కవిత్వ పటుత్వ సంపదను ప్రసాదించి, సాహిత్యశోభను కలుగజేయుచు. సృష్టికర్తపట్ల భక్తి ప్రపత్తులను ప్రస్తరింప జేయుచున్నది.

నవ్యకవులు ప్రకృత్యుపాసకులు. ప్రకృతి రహస్యములతో ఆత్మభావములను సమన్వయించుకొనుటలో వీరికితృప్తి కలదు. ప్రీతికలదు.

"వాల్మీకియొక్క స్వాభావిక రీతిలోనే వీరు తృప్తిపడక ప్రాయికముగా ప్రకృతిని స్వీయదుఃఖప్రకటనకు, ఆత్మానుభూతి సమున్మీలనమునకు ఆలంబనముగ గ్రహించిరి. ప్రకృతి వీరి చర్మచక్షువును దాటి హృదయ నేత్రములలో ప్రవేశించినది. అనగా కంటికి కనిపించిన ప్రకృతికాక గుండెకు స్ఫురించిన ప్రకృతియే వీరిక వర్ణ్యమైనది." (ఆధునికాంధ్రకవిత్వము - డా. సి. నారాయణరెడ్డి) ప్రకృతిని నవీన కవులు ఒజ్జగ, తల్లిగ, దేవతామతల్లిగా భావించుటయేకాక; ప్రియురాలుగా కూడ దర్శించి చిత్రించుచున్నారు. పూర్వ కావ్యములలో ఉద్దీపనవిభావమైన ప్రకృతి నేటి కావ్యములలో ఆలంబనవిభావముగా పరిణమించినది.

"ప్రకృతిలోని ప్రత్యణువున
పరమాద్భుత శోభాన్విత
సౌందర్యము నిర్లిప్త
స్థాయిలోన నిద్రించును."
— నాగార్జునసాగరం -
డా. సి. నారాయణరెడ్డి.
ద్వితీయతరంగం. పుట : 36

అని నవ్యకవులు ప్రకృతిలో సౌందర్యమును దర్శింప గలుగుచున్నారు. ప్రకృతి ప్రభావమువలననే విశ్వములో విజ్ఞాన చంద్రికలు వ్యాపించి, చైతన్యము కలుగుచున్నదని నేటికవుల భావన.

"ప్రకృతిలలితాంగి నీదుప్రభావకలన
వెలయు విజ్ఞానచంద్రికల్ విశ్వమందు
రాజులేకయ రాణించు రాత్రి యెట్లు
ఇనుడులేకయ శోభిల్లు దిన మదెట్లు?

(భారతి. 1925. ఫిబ్రవరి. సంపుటి: 2 సంచిక : 2 ప్రకృతి : ఉపాధ్యాయి)

అను పద్యము పైభావమును స్ఫురింప జేయుచున్నది.

ప్రకృతిని వర్ణించుటలో కవులు రెండు పద్ధతులను అవలంబించినారు. మానవ స్వభావాదులను ప్రకృతి కారోపించి, అది మానవుని కష్టసుఖములతో సానుభూతిని చూపుచున్నట్లు వర్ణించుట మొదటిపద్ధతి. దీనినే ప్రకృతిని మానవీకరించుట అనియందురు. ప్రకృతిసౌందర్యమును ఉన్నదున్నట్లుగా సహజముగా వర్ణించుట రెండవపద్ధతి. ఈ రెండు పద్ధతులను ఆంగ్లకవులు, ఆంధ్రకవులు సమానముగా అనుసరించినారు. కవులు అవలంబించిన రెండు పద్ధతులును అందమైనవే. అయినప్పటికిని మానవచర్యలకు సంబంధపడిన ప్రకృతివర్ణనమే మరింత సజీవముగను, మనోహరముగను ఉండును. ఆధునిక కవుల కథావస్తువు మానవస్వభావ చిత్రణమునకు అత్యంత సన్నిహితమైనది. సామాన్యమైన మానవజీవితములో గూడ కవిత్వమునకు తగిన రసోత్పాదక సన్నివేశము లుండునని నిరూపించు పటుత్వమైన నవ్యకవిత్వమును అందించు వారందరును మనకు అభినందనీయులు.

ప్రకృతి కవిత్వములో "భావితానందము, అంతర్ముఖత్వము, తాదాత్మ్యము, పారమార్థికత" అను లక్షణములు కలవు. నవ్యకవుల కవిత్వములో ఈలక్షణము లెంతవరకు పొందుపరుపబడినవో తరువాతి వ్యాసములలో పరిశీలింపబడును.

# శ్రీమద్భగవద్గీత - దైనిక జీవితము

— శ్రీమతి యస్. రమాదేవి, బి. ఏ., బి. యిడి.

## గీ తా వి ష య ము

అవతార పురుషుడైన శ్రీకృష్ణుడు, ఆచార్యుడై ప్రపంచమునకు ఉపదేశించినది గీత. భగవద్గీత మహాభారత కావ్యములోనిది. దీనినే సంక్షేపముగా "గీత" అని పేర్కొంటారు.

నేడు, ఈ భగవద్గీతకు మూలమైన భారతకథను గూర్చి కొందరికి, సంశయములు కలిగినవి. భారతయుద్ధము మహాయుద్ధమా ? అసలు పాండవులు, కౌరవులు అనేవారు ఉన్నారా ? అవతారపురుషునిగా చెప్పే శ్రీకృష్ణుడు, భారతకృష్ణుడు ఒక్కరేనా ? అని. భారతము యథార్థము కాదనేవారు కొందరు. ఇది యథార్థమే అనేవారెందరో ఉన్నారు.

ఈ హేతువాదానికి, భూతవాదానికి, ఒక నమస్కారము. మనది 'ఉపయోగ' వాదము. గీతవలన ప్రపంచమునకు కలిగే ఉపయోగమేమిటి ?

భారతం ఒక మహాగ్రంథం. ప్రపంచములో అన్ని విజ్ఞానాలూ బోధించే అనేక గ్రంథాలున్నాయి. అన్నింటిలోనున్నది భారతములో ఉన్నది. భారతములో లేని దెక్కడాలేదు. "యదిహాస్తి తదన్యత్ర, యన్నేహాస్తి నతత్ క్వచిత్" అని ప్రాచీనులన్నారు. ఇది నిజమా! అనిపిస్తున్నది. నిజమే అయితే భారతానికి హృదయమైన గీతయొక్క విశిష్టత ఏమిటి ?

ఆధునిక కాలములో విజ్ఞానము చాలా విశాలమైనది. మానవులను, వారిస్థితిగతులను వివిధకోణాలనుండి పరిశీలించిన వేర్వేరుశాస్త్రజ్ఞులున్నారు. పరిశీలనపై వారు అనేక సిద్ధాంతాలను ప్రకటించారు. బాగుగా పరిశీలిస్తే నాటిగీతలో నేటిసమస్యలు, సిద్ధాంతాలూ వివరంగా పరిశీలించి పరామర్శింపబడినవే అనిపిస్తుంది.

ఆనాటికి, ఈనాటికి, ఏనాటికీ గీత ఉపదేశమే. మారేది ప్రపంచధర్మం. మారుతున్న కాలంతోపాటు మానవులు మారుతున్నారు. మారిన మానవులు వారి దృష్టితో గీతను అర్థం చేసుకుంటే వారికి గీతయొక్క ఉపయోగం విస్పష్టమౌతుంది.

సృష్టిలో ఒకరిని పోలినవారొకరుండరు. ఎంతసామ్యమున్నా ఏదో ఒక భేదము కనిపిస్తుంది. ఒకరి జీవితములోనే ఎన్నో మార్పులు. మానవుడు పుట్టి పెరిగి జీవనయాత్ర చాలించేవరకు అనేకములైన సంఘటనలు, సమస్యలు, అతని జీవితములో వస్తాయి. వానినెదుర్కొని పైకి వచ్చేసరికి మనస్సు పరిణతమౌతుంది. కాని అందరూ ఈవిధమైన పరిపక్వత పొందగలరా ? అది సందేహమే! మానవులలో నొకరినిపోలినవారొకరు లేనట్లే ఒకరి కున్నశక్తి వేరొకరి కుండదు. అన్ని వయసులవారికి అన్ని వర్గాలవారికి, అన్ని దేశములవారికి మార్గదర్శకమైనది గీత.

శ్రీకృష్ణుడు గీతను అర్జునునకే ఎందుకు ఉపదేశించాలి ? పదునెనిమిది అధ్యాయములలో సుదీర్ఘమైన గీతను యుద్ధ సందర్భములో నుపదేశించుట జరిగిందేనా ? ఇలా అనేక సందేహాలు మనలను వేధిస్తూంటాయి. అర్జునుడు మహాయోగి. తపశ్శాలి.

పరమేశ్వరుని గూర్చి తపస్సుచేసి పాశుపతాన్ని సాధించాడు. ఇంద్రుని మెప్పించి ఇంద్రలోకం వెళ్ళిన మహాఘనుడు. కృష్ణునకు ప్రియుఁడు. అదీకాక సర్వస్వము భగవానునకే అర్పించి ఆయన శరణుకోరినాఁడు యుద్ధసమయంలో.

గీతాచార్యుని కెప్పటికప్పుడు తన సందేహాలను వెలిబుచ్చుతూంటాడు అర్జునుడు. అవి ఒక్కొక్కసారి తలుచుకుంటూంటే నవ్వుకూడా వస్తుంది. పరమేశ్వరుని మెప్పించి పాశుపతాన్ని సంపాదించిన మహాతపశ్శాలి, ఇంద్రుని జయించిన మహావీరుడు, అయినట్టి అర్జునుని బుద్ధి ఇంతమాత్రమే పరిపక్వమైందా ? సామాన్యమానవులకు గల హృదయదౌర్బల్యమేనా అర్జునునిది కూడా ?

కానీ స్వజనంతో యుద్ధ మతనిజీవితంలో క్లిష్టసమస్యైంది. ఆసమస్య నెరుగ్గొనలేని నరుడైన అర్జునకు చేయూతనిచ్చి మానసిక పరిణతిని కలిగించినది నారాయణుడైన శ్రీకృష్ణపరమాత్మ. జీవాత్మకు పరమాత్మ సహాయసహకారము లెప్పుడూ ఉంటాయి. దానిని వినియోగించుకొనుటయే మానవుని కర్తవ్యం.

అర్జునుని మిషతో ప్రపంచములోని మానవుల సందేహాలను సర్వదా, సర్వత్రా నివారించగల ఉపదేశాన్ని గీతాచార్యుడు చేసాడు.

'భేరీలు శంఖాలు మ్రోగుతూ యుద్ధం ఒక్కక్షణంలో ఆరంభంకానున్న సమయంలో పదునెనిమి దధ్యాయముల గీతను పరమాత్మ అర్జునునకుపదేశించుట హాస్యాస్పదముగా నున్నది'. అని పలువు రంటూంటారు.

'దివ్య చక్షువుల నిచ్చి ఎంతటి తపస్సంపన్నులూ చూడలేనటువంటివి విశ్వరూపాన్ని అర్జునునకు చూపిన పరమాత్మ పదునెనిమిది అధ్యాయములను ఒక్కక్షణములో చెప్పనూగలడు. చెప్పినదానిని ఆయన కటాక్షమువలన విని అర్థముచేసుకో గలిగే శక్తిని ప్రసాదించనూ కలడు' అనుటలో ఆశ్చర్యము,అనుమానము రాకూడదు.

పరమాత్మ అర్జునునకు గీతోపదేశము చేయుచుండగా విన్నవారు ఇంకా ఉన్నారు.వారు విష్ణ్వంశలో పుట్టిన వేదవ్యాసులవారు, వేదవ్యాసవరప్రసాదమునొందిన సంజయుడు, అర్జునుని జెండాపైనున్న అనన్యభక్తాగ్రేసరుఁడైన ఆంజనేయుడు.

అర్జునునకు విన్నంతనే బోధపడింది. ఆదివ్యసందేశ మర్జునున కొక్కనికే కాదని ప్రజలందరికోసమని గ్రహించిన శ్రీవ్యాసులవారు దానిని యథాతథంగా కాకపోయినా సామాన్యులకు కూడా అర్థం అగునట్లు ఏభాగాని కాభాగం విడిగా వివరంగా ప్రవచించి యుండవచ్చును.

## నేడు గీతయొక్క అవసరం ఏమిటి ?

ఆనాడు కురుక్షేత్రంలో కౌరవ పాండవులకు జరిగిన యుద్ధంలాంటి యుద్ధము ప్రతిఒక్కరి అంతరంగంలోనూ జరుగుతూంది. కౌరవులు వందమంది. వీరి తండ్రి ధృతరాష్ట్రుడు పుట్టుగ్రుడ్డి. తల్లి గాంధారి. ఈమె కన్నులున్నా కండ్లకు గంతలు కట్టుకొని గ్రుడ్డితనం తెచ్చిపెట్టుకుంది. ఈ ఇరువురు గ్రుడ్డివాళ్ళకు పుట్టిన వందమంది దుర్యోధనాదులు మంచి, చెడ్డా తెలుసుకోలేని మూఢులైనారు. ఇటువంటివారికి

కను లున్నా లేనట్లే. పాండవులు పంచేంద్రియములవలె అయిదుగురు. వీరు కుంతీ మాద్రీపుత్రులు. దైవాంశ సంభూతులు.

ఇటువంటి కౌరవులకు పాండవులకు ఆనాడు యుద్ధం జరిగింది. అంగబలం, అర్థబలం ఆడంబరముగా ఎక్కువగా నున్నప్పటికీ కౌరవులు దైవోపహతులై- దైవ రక్షితులైన పాండవులచేతిలో ఓడిపోయారు.

నేటి మానవులలో చాలామందికి పుట్టుకతోనే అజ్ఞానం, పెరిగిన వాతావరణం వల్ల తెచ్చిపెట్టుకున్న అజ్ఞానం. ఈ రెండు అజ్ఞానాలు కలియగానే మానవుల మనస్సులో భౌతికసుఖాలమీద కోరికలతో అనేకములైన (కౌరవులవంటి) దుష్టశక్తులు పుట్టుకొని వస్తున్నాయి. కౌరవులవంటి ఈ దుష్టశక్తులకు, పాండవులవంటి పంచేంద్రియాలకు, ఎడతెగనిపోరాటం ప్రతిఒకరి అంతరంగంలోనూ జరుగుతూంది. పంచేంద్రియాలకు వాటిని తప్పత్రోవను పట్టించే శారీరకమైన తుచ్ఛసుఖాలతో యుద్ధమే నేటి కురుపాండవ యుద్ధం. దుష్టశక్తులపైనే మానవునికి మమకారం పెరుగుతూంది. ఆమమకారంతోనే నేటివారు విచక్షణారహితంగా ప్రవర్తిస్తున్నారు. అందుచేతనే అశాంతి ఎక్కడ చూచినా.

దుష్టులని తెలిసీకూడా ఆనాడు కౌరవులతో అర్జునుడు యుద్ధం చెయ్యలేక పోయినాడు. ఎందువలన ? తన దాయాదులు, తాతలు, గురువులు, మేనమామలు అనే మమకారం పెట్టుకొనుటచేతనే !

నాఅవయవము లస్వాధీనంగా ఉన్నాయి. నోరెండిపోతున్నది. శరీరం వణుకు చున్నది. గాండీవము జారిపోవుచున్నది. కౌరవులతో నేనీయుద్ధము చేయలేను అని శ్రీకృష్ణపరమాత్మశరణు కోరాడు అర్జునుడు.

ఆనాటి అర్జునునివలె గీతాచార్యుని ఉపదేశాన్ని శరణు కోరితేకాని మనకు శాంతి లభించదు. ఈనాడు ప్రపంచమున శాంతి లోపించింది. భౌతిక సుఖాలకోసం మానవులలో ఆరాటం పెరిగింది. నాగరకత పెరిగింది. నేడు ఎన్నో సుఖాలకి మానవుడు అలవాటుపడియున్నాడు. చక్కరవ్యాధితో బాధపడేరోగి తియ్యటి ఆ చక్కరపాలు రక్తంలో ఎక్కువకాటంచేత రాచపుళ్ళతో ఎలాబాధపడతాడో అదే విధంగా తియ్యటిసుఖాలమధ్య నేటి మానవులు రాచపుళ్ళవలె బాధించే అనేక సమస్యలను భరించవలసివస్తూంది. ఈ సుఖాలలోనే ఏదోఒక తెలియని అశాంతి, అసంతృప్తి మానవునికి కలుగుతున్నాయి.

ఈ అసంతృప్తి విపరీత పరిణామాలను సృష్టిస్తూంది. ప్రతిరోజూ దినపత్రిక తీయగానే- అవినీతిపరులైన ఉద్యోగులు, అన్యాయానికి పాలుపడ్డ అధికారులు, నల్లధనాన్ని నిలువచేసేవ్యాపారస్థులు, హత్యలు, స్త్రీలను మానభంగాలు చేసే క్రూరులు, ఆత్మహత్యకు పాలుపడే అసమర్థులు,- వీరిని గురించిన వార్తలే చూస్తున్నాము. ఎక్కడచూచినా ధర్మలోపమే! తమ కెదురయ్యే క్లిష్టసమస్యలను పరిష్కరించుకోలేక మానవు లధర్మానికి లోనౌతున్నారు. ఆనాటి అర్జునునివలె గీతోపదేశం వివేకంతో తెలుసుకుంటే సమస్యలు దూరమౌతాయి. శాంతి లభిస్తుంది. గీతామృతం భారతంలోఉన్న దని, దానిని శ్రీకృష్ణపరమాత్మ అర్జునునకు బోధించాడు

అని మాత్రం తెలుసుకుంటే చాలదు. దానిని భక్తితో చదివి అర్థంచేసుకొని ఆచరణలో పెడితే అనుభవయోగ్యం అవుతుంది. అనుభవంవల్ల మాత్రమే గీతామృతము యొక్క రుచిరతి తెలుస్తుంది.

## గీత ఎవరికి ?

"గేయం గీతానామసహస్రం" అని "గీతా సుగీతా కర్తవ్యా" అని పండితులు చెప్తారు. తప్పక గీతను పఠించాలి. పారాయణచేయాలి. గీతాపుస్తకము పట్టుపాత్రిళ్లలో జాగ్రత్తచేసి పూజామందిరంలో పెట్టి పూజ చేయటానికికాదు. గీతను చదవటానికి ప్రత్యేకఅర్హత లున్నవా అన్న సందేహం కలుగవచ్చు. అందరూ గీతామృతాన్ని ఆస్వాదించవచ్చును. మానవులై ఉండుటయే గీతామృతాన్ని ఆస్వాదించటానికి అర్హత. ఉద్యోగవిరమణ చేసిన తరువాత కాలక్షేపమునకు చదువుకొనే గ్రంథముకాదు. ప్రతితల్లి ప్రతిబిడ్డకు ఉగ్గుపాలతో నేర్పవలసిన విషయము లెన్నో ఉన్నాయి. గీత జీవులందరకు మాత.

గీతలో యోగ్యత ననుసరించి పాటించడానికి అనేక యోగాలను గీతాచార్యుడు వివరించియున్నాడు. వానిలో తనకు నచ్చినయోగాన్ని ఆయన చెప్పినాడు. కానీ తాను మెచ్చిన యోగాన్నికూడా వివరించాడు.

యుద్ధారంభములో దుఃఖముతోవిన్న అర్జునునిది విషాదయోగము. అనేక సమస్యలతో సతమతమౌతూ ఏమీపాలుపోకున్న నేటి మానవులు విషాదయోగములోనే ఉన్నారు. యోగము అంటే 'కూడిక' అని అర్థము. 'విషాదయోగము' అంటే విషాదముతో కూడియుండుట అని అర్థము.

ఒకవిషయమును గూర్చి దుఃఖిస్తూకూర్చోటం 'క్లైబ్యం' (నపుంసకత్వము) అని ఆచార్యుడు వివరించాడు. సంశయగ్రస్తులు నశిస్తారు. దేనినీ లెక్కచేయక తమ కర్తవ్యాన్ని తెలుసుకుని కార్యోన్ముఖులైనవారే జయిస్తారు. ఈ కర్మయోగమే శ్రీకృష్ణ పరమాత్మ మెచ్చినయోగము. ధర్మసమ్మతమైన కర్తవ్యాన్ని కష్టనష్టాల కోర్చి వాటిని లెక్కచేయకుండ ఆచరణలో పెట్టాలని పరమాత్మ సందేశం.

గీతను చదవండి, పారాయణము చేయండి అని మహాత్ములు ఘోషిస్తారు. ఆ చదువుట పారాయణముచేయుట ఊరకకాదు. ఆచరణలోపెట్టాలి. విరాగియై సర్వసంగ పరిత్యాగం చేసి, గీతను చదువుచూ కూర్చుంటే సిద్ధికలుగదు. అది అభ్యాసం వలననే కలుగుతుంది అని గీతాచార్యుడు చెప్పియున్నాడు. అభ్యసించటం అంటే ఆచరణములో పెట్టుటయే అని మనము తెలుసుకోవాలి. గీతలోని సత్యాల నాచరణలో పెట్టిననాడే సఫలత సిద్ధిస్తుంది.

భగవద్గీతా కించిదధీతా, గంగాజల లవకణికాపీతా,
సకృదపి యేన మురారి సమర్చా క్రియతే తస్య యమోఽపి న చర్చా.

అని భజగోవిందములో చెప్పినట్లు భగవద్గీతలోని కించిత్ భాగాన్నైనా అభ్యాసము చెయ్యాలి. చేసిన మోక్షము (బ్రహ్మానందము) లభిస్తుంది. (సశేషము)

# గ్రంథసమాలోచన

## నిశాంతం

గ్రంథకర్త: శ్రీ ఆర్. యస్. సుదర్శనం.

వాఙ్మయ మొక మహావనము. వనములో చిత్ర విచిత్ర ఫలపుష్పవిరాజితము లగు లతా గుల్మ వృక్షములు బహిరంతారంజకములై బహుప్రకారముల నుండును. దీనికి మూలము వాక్కు. దీనిలోని ధాతు వెంత విచిత్రమో రూపము లంత విచిత్రములు. ఇట్టి వాగ్విలాసమే కవిత. ఈకవిత స్వాత్మాశ్రయము పరాశ్రయ రూప మని నవీనుల యభిప్రాయము. ఇట్టి కవిత ప్రస్ఫుటముగా నీశతాబ్దములో మనకగపడినను దీనికి మూలప్రకృతి ప్రాచీనులచాటువు లని చెప్పవచ్చును. కవితా పరమావధి, దాని గమ్యము, ఒక్కటేయైనను దేశకాలాదుల ననుసరించి లక్ష్యము మాత్రము కొంత మారినట్లున్నది. చివరకు అనువాదాది కవితారీతులలో భావకవిత్వము నొకటియైనది. ఇట్టి కవితా లతాంతములలో నిశాంత మొకటి.

లతాంత నిశాంతశబ్దములు విచిత్రములు. లతా+అంతము, నిశా+అంతము అను విభాగము భ్రామకమైయుండును. పంకజాది శబ్దములకు యౌగికార్థము గ్రాహ్యము కాదు, రూఢ్యర్థము గ్రాహ్య మని లాక్షణికులు 'రూఢిర్యోగ మపహరతి' యని యను శాసించిరి. అర్థభేద మవసరమైన యనుకాదులలో నిట్టి వ్యుత్పత్తిని దీయవచ్చును. నిశాంతమనుశబ్దము రాత్ర్యంత మనునర్థమున నుపయోగింపబడినట్లున్నది. బంధితుడు, ఊయెల, ప్రేమలేఖ, సంధ్య, ప్రకృతిపూజ, జారినస్వప్నము, జన్మలు, ఆదర్శనోత్సుక అఘము, శాపము, అహంత, ధర్మము, నేను, వర్షము, సత్యభామ, ఉదయరుచులు, నేత్రాంచలదీపము, నీవు, ద్విజుడు, మందారము, నవర్తువు, ఊర్వశి. ముద్దు, నిశాంతము అను ఖండిక లిందున్నవి. ఇది సుమారుగా నూరు పద్యముల సముదాయము. తేటగీతులు, కందములు బహుళముగా స్వీకృతములు. ఇవియన్నియు కవికిఁగలిగిన భావనావిశేషములను దెలుపును. బహిరంగముగ భిన్న భిన్నముగా నున్నట్లున్నను భావన లన్నియు కవివే కావున భావనావిశేషమునే వస్తువుగా స్వీకరింపవచ్చును. కథా భిన్నములైనను వస్త్వైక్యముగల రచనలకు ఆముక్తమాల్యదవంటి వానిని పేర్కొనవచ్చును. గోదాదేవిచరిత్రతో పాటు మిగిలిన కథ లందున్నను, దానికి ఆముక్తమాల్యదయని గోదాదేవిచరితనే ప్రధానముగా జేసి నామకరణముచేయుట ప్రాచీనపద్ధతియే. ఇట్టి విన్యాసము కవికి గల ప్రాచీనాసక్తిని వెల్లడించును.

‘బంధితుడు’ వ్యక్తికిగల పరాధీనతను వ్యక్తముచేయుచు నతని యస్వతంత్రతను స్పష్టముచేయును. కవికి గల బంధవిచారణను, ముముక్షుతను వ్యక్తముచేయును. ‘వెలుగుకాంతి నవఘళించు స్వేచ్ఛావలయు’ నని ముక్తకంఠముగా నాక్రోశించును. ఊయెల మిక్కిలి హృదయంగమమైనది. “ఉభయసంధ్యలమధ్య నిట్లూగుచున్న బ్రదుకుటూయెల దీనికి స్వాస్థ్యమెట్లో” యను జిజ్ఞాసను రేకెత్తించును.

ప్రేమలేఖయు నట్టిదే. వీరిరచన మొదటినుండియు పాఠకునకు భావవైవశ్యము గలిగించును. శ్రీ విశ్వనాథవారన్నట్లిది యొకయనుభూతికావ్యము. ఈకావ్యము కవికి గల తాత్త్వికదృష్టిని, జిజ్ఞాసను, భావనాశక్తిని, విన్యాసశీలతను వ్యక్తము చేయును.

“అంధకార నిశ్శబ్దహృదంతరమ్ము మ్రోగ చలియించు గివ్వెల మువ్వలేవొ” ఇందు మొదటిపదమైన సమాసము తృతీయాతత్పురుషానుప్రాణిత షష్ఠీతత్పురుష మయినచో నంధకారముచే నిశ్శబ్దమయిన హృదంతరమని చెప్పవలెను. అంధకారముచే నిశ్శబ్దత వచ్చునా? అంధకారము అజ్ఞానవాచకమా? అయినచో గివ్వెల మువ్వలు మ్రోగగా నజ్ఞాన మేమయినది? ‘మ్రోగ చలియించు’ను యథాసంఖ్యముగా గ్రహించినచో నంధకార నిశ్శబ్దములకన్వయము కుదురునా? అట్లే ‘ఊయెలలో’ మూడవపద్యమున, హర్షమునరాగ మెరుగని అంతరంగమ్ము సిగ్గు దొంతరలపయ్యాట లాడి, అనుచోట రాగ మెరుగని హర్షమేమి. హర్షము రాగమూలకమే కదా! ఒక వేళ నద్వైతానంద మగుచో సిగ్గుదొంతరల పయ్యాటలాడుట యేమి? ప్రేమలేఖలో– ‘ఇది విరహాకీల వ్రాసిన హృదయలేఖ’ ఇట కీల యనునది చెప్పనది యగ్నిజ్వాలనా లేక ‘చీల’నా? అగ్నియైనచో విరహాగ్నియందు లేక విరహాగ్నిచేత అని చెప్పిన సరిపోవునా? చీలయైనచో విరహమనుచీలయని చెప్పవచ్చును. కాని వ్రాయుటకు గంటము నుపయోగించుటయున్నది; కాని యిది లేదే.

‘సంధ్య’లో ‘విరహాఘోషా నిరంతరాన్వేషణమ్ము’ ఘోషాశబ్దము విచారణీయమేమో. ఆశీర్షికయందే ‘ఏల వనితాహృదయభావ మెపుడు శ్లేషయైనిగూఢమై వ్యక్తమవ్యక్తమగుట” ఇందు క్రీగీటుగీచిన పదప్రయోగము విచారణీయము. ‘ఆదర్శజ్యోత్స్న’లో తెల్లని వెన్నెల మేనన్ మల్లెలయూర్పు నిలిచి యొక మధుర తమస్విన్, సల్లలితరూపిణి భవోత్ఫుల్ల మనోజాతయైన ముగ్ధ నౌనగ్చెన్’ అను పద్యమున రాత్ర్యర్థమున తమస్వినీశబ్ద ముండవలయును. మరియు తమస్వినీశబ్దము రాత్రి సామాన్యవాచకమేయైనను తమోవిశిష్టత్వమును సూచించుచున్నది. తమస్వినీశబ్దము తమస్వినిన్ యగును. ఒకవేళ ముద్రారాక్షసమేమో! అట్లే సర్గములో చివరిపద్యమున చివరిపాదములో ‘నాత్మతహృది నొక్క దివ్యనయిన మునర్చెన్ కూడ కావచ్చును.

సత్యభామలో చివరి పద్యములో చివరిపాదమున- ఈశ్లోకము తెల్లవారు హిత స్మితమై(కందము) ఛందస్సు తప్పినట్లున్నది. బహుశః ముద్రాప్రమాదము కావచ్చును. అట్లే ఆదిని సమర్పణము రెండవ పద్యమున రెండవ పాదమందలి ఛందోదోషమును (జపమై కవిత్వ...సాధన అపూ) కావచ్చును. సుందారామములో చివరి పద్యములో ఉత్తరార్థము (నాతలపు నేనెతట్టిన జ్ఞానలవమ్ము,నవ్వే ముద్దుమందారము నన్ను జూచి) సార్థకమై లేదు. నిశాంతములో - 'జీవన నిశాప్రవాహ సుషిరములంగు' అర్థానిత్యా దులు విచారణీయములు. ఇట్టి వచటనచట నున్నను శీర్షిక లన్నియు నిరాఘాటములై కవితాత్త్వికతాదులను పాఠకునకు సాక్షాత్కరింప జేయును. పదబంధము, భావగాం భీర్యము, చిత్రణ మున్నగునవి మనోహరములు.సంధినియమము పాక్షికముగాఁబాటింప బడినది(అఘములో రెండవపద్యము. ఇంద్రుని యకృత్యము సహాల్య ఏడ్పు - వంటివి)

పూర్వకవిత్వము వివిధాధికారుల నుద్దేశించినది. ఇప్పటి కవిత్వ మట్లుకాక భిన్నమైనది. వాఙ్మయములో నిది యొకప్రక్రియ. కోటేటివారి యేకాంతసేవ, మున్నగునవి యిట్టివే. శ్రీ విశ్వనాథవారు స్వయముగా కోరి యంకితమందుట, తాము రచించిన గిరికుమారుని ప్రేమగీతాలవలె నున్నదనుట, దీని ప్రాశస్త్యమును సూచిం చును. ఇది ముప్పది యెనిమిది పేజీలగ్రంథము. దీని చివర శ్రీ విశ్వనాథవారి మున్నుడి (విశ్వనాథవారిచే మునట ముద్రింపబడిన గ్రంథములోనిది) కలదు. కృతి స్వీకర్తలైన శ్రీ విశ్వనాథవారి మున్నుడి దీనికి నైసర్గికాభరణంగావుంది. కృతిస్వీకర్త తానంకితంగా పుచ్చుకొన్న గ్రంథముపై వివరణము మున్నుడిగా వ్రాయుట యపూ ర్వము. కవిగారి కవితాతత్త్వమును, భావగాంభీర్యాదులను చక్కగా వివరించిరి. మున్నుడి గ్రంథాదిలో నున్నచో బాగుండెడిది. మునట శ్రీ గుంటూరు శేషేంద్ర శర్మగారి కావ్యతత్త్వప్రదీపిక యిరువదిరెండు పేజీలది కలదు. దాని తరువాత కవి రచించిన అవతారిక కలదు. శ్రీ శేషేంద్రశర్మగారి ప్రదీపికకు ముందు సమర్పణము కలదు.

శ్రీ గుంటూరువారి కావ్యతత్త్వప్రదీపిక యిందు మితిమించిన ట్లున్నది. కవి త్వము, యోగము, శాస్త్రములు, సంగీతాదులు మున్నగువాని గమ్య మొక్కటైనను మార్గములుమాత్రము వేరు. ఒకమార్గమునకు మరొకమార్గమునకుపోలికలున్నను భ్రాంతి పడరాదు. సోదరులకు పోలిక లున్నను అన్న తమ్ముడగుట, తమ్ముడన్నయగుట జరు గదు కదా! మన కిష్టమైనది, తెలిసినది, ప్రతిచోటనున్నట్లు మన కనిపించును. కావ్య ములో కుండలినీవిన్యాసము గౌణము. కావ్యవిలాసము ప్రధానము. శ్రీ గుంటూరు వారి ప్రదీపికలో పాశ్చాత్య విద్వాంసుల యుద్ఘాటన యెక్కువైనది. మన ధర్మ ముల మనకు సమన్వయము చేసికొనుట మాని యితరుల ధర్మముల సమన్వయము చేయనెంచుట సముచితమా ? తమకు కవిగారిపైనున్న అభిమానాన్ని అనుపానంచేసి తమ పాశ్చాత్యసిద్ధాంత పరిచయాన్ని పునఃపున రుపబృంహితం చేయడం జరిగింది. కవిగారి పద్యాలలో వేదమంత్రార్థాలు నిక్షిప్తా లన్నారు. మరి యితర భారతీయ

శాస్త్రధర్మాలని చూపని కారణం యేమిటో? జీవయాత్ర, కాలపునరావృత్తి, భౌతిక బౌద్ధికాలని అంటూ రెండూ వెలుగునీడల్లా రాత్రిందివాల్లా ఒకదానివెంట మరొకటి పరుగెడుతుంటా యన్నారు. వారుచెప్పిన రెంటికీ పౌర్వాపర్యంవుందో సమకాలీను భూతిత్వం వుందో పరిశీలించవలసిన విషయం. ఉపమానోపమేయాలకి బింబ ప్రతి బింబభావంవుందా? అనుభూతి మధురిమ ఆంతరికంగా నిశాంతలో వుందంటూ అలా కాకపోతే యిది యే సౌందర్యలహరో కామకళావిలాసమో అయివుండే దన్నారు. ఏతత్ ప్రస్తావనోపయోగం యేమిటి? వారికి గల యోగాది తాంత్రిక విజ్ఞానం అలా అనిపించి వుండవచ్చు. సుదర్శనంగారి పుస్తకంలో మనం తుపానులోలా కొట్టుకపోతాము, అని అది మనల్ని నిమజ్జనం చేయిస్తుందంటారు. తుపాను నిమజ్జనం చేయించదే. మనల్ని యెగరేసుకపోతుంది. ఇది ఒక నవీన ప్రక్రియ. పాశ్చాత్య గ్రంథ సంశీలనంవలన వచ్చింది అని అంటారు. Disordering of senses అంటే యింద్రియవ్యత్యయం అన్నారు. వ్యత్యయం అంటే మార్పు. అంటే ఒక యింద్రియం చేసేపని మరొక యింద్రియం చేయడం అని అర్థం రావచ్చు. నిశాంతాన్ని ఉప్పా దృష్టితో చూడవద్దన్నారు. తెలుగులో యిలాటి కవిత్వంగాని యిలాటి కావ్యంగాని లేదన్నారు. ఇది విచారణీయమైన విషయమే.

కవులమీద విమర్శకులమీద అకాండ తాండవం చేశారు. కవి, విమర్శక పదాలకి భేదం, అర్థం, సరిగా ఆలోచిస్తే అలా అనరు. విమర్శకపదంలో చివరి మొదటి అక్షరాలని కలిపితే కవి అయినాడు. లేదా కవిపదాన్ని భాషాశాస్త్ర విన్యాసంలో తికమకపెడితే విమర్శకుడైనాడు. వాల్మీకి రామాయణంలో రామకథ ముఖ్యం మిగిలినవి గౌణాలు. ఛాయామాత్రాలు. అవే ప్రధానాలయితే యిక శాస్త్రాలెందుకు? కావ్యానికి వచ్చిన ప్రాచుర్యం శాస్త్రానికెందుకురాలేదు? కవిగారు నైషధ మొక్కటే రాసిన హర్షుడిలావున్నా రన్నారు. తెలుగు విమర్శకులకు కొన్ని లక్షణాలు (నీతి నిర్భీకతా, వైదుష్యాలు) లేవని అన్నారు. కవి కావడానికి విద్యాశిక్షణ, ముఖ్య మన్నారు. శక్తి, నిపుణత, లోకశాస్త్రాది జ్ఞానము పూర్వ పూర్వ ముఖ్యాలనీ, వుత్తరోత్తరాముఖ్యాలనీ, మూడూ సముదాయంగావుంటే మంచిదనీ మన ఆలంకారికుల నిర్ణయం. బహుశా వారినిర్ణయం అభారతీయం అయివుంటుంది. వారు ప్రయోగించిన 'వాచితం' అనేపదం సాధువేనా? మొత్తంమీద వీరి పీఠిక అంతా కవిగారిని మెచ్చడం ముఖ్యమో తమ పాశ్చాత్య విజ్ఞానాన్ని చూపడం ముఖ్యమో నిశ్చయములేక రెంటినీ కలిపి చేసినట్లుగా వుంది. మొత్తంమీద ఇది గ్రంథానికి సరితూగిన ట్లుండబోయి మించి నట్లున్నది. నిశాంతంలో 'నీలిచేలాంచల'ములో, ధర్మములో ఆద్యంతములలో నొకేపద్యమావృత్తమగుట, 'వేను'లో కొన్ని పాదములు ఆవృత్తములగుట జరిగినది. పద్యపాదపునరావృత్తులు పాఠ్యప్రాయములు సార్థకములునై యున్నవి. పుస్తకంపైని కవిపేరూ, క్రిందకావ్యం

( తరువాయి 18 పేజీలో )

# కందకవి సార్వభౌముల కవితావైభవము

— శ్రీ శివలెంక ప్రకాశరావు, ఎం. ఏ.

( గతసంచిక తరువాయి )

విశ్వరూప సందర్శన యోగము : "చిన్నమఱ్ఱి విత్తనమున పెద్దచెట్టగునట్లు భూతజాలమంతయు నాయందు పుట్టి పెరిగి గిట్టును. నీటిలో ఉప్పుకల్లు వేయగా కరిగిపోవును. ఆనీటిని కాచగా మఱల పూర్వరూప మొందునట్లు, ప్రత్యహము సూర్యబింబమున మహాప్రభ పుట్టునట్లు నాశరీరమున జగాలుపుట్టి ప్రకాశమునొంది, లయించును. నీచర్మచక్షువున నిదంతయు కానలేవు. కాన ఈ దివ్యదృష్టితో చూడు"మని దివ్యజ్ఞావలోచనము శ్రీరామున కిచ్చి శివుడు పెద్దమెఱపుతో భయముగొల్పుచు పాతాళగుహవోలె నోరు తెఱచి చూపెను.

రాముడు సాష్టాంగవందన మాచరించి దివ్యదృష్టితో శివుని ముఖమందు చరాచర జగత్తంతయు చూచెను. ఆశ్చర్యముతో రాము డిట్లు నుతించెను.

'జనుడు శుక్రరజశ్శ మని భ్రమించెను మూఢుఁడై, త్రాడె పామటంచు దలచురీతి.
నిఖిలమీజగమ్ము నీకంటె నితరమ్ము, లేదటంచెఱుంగ లేదు జడత.' (2-67)

"సూర్యుడు నీరుగల కూపములలోను, ఘటములలోను వేఱువేఱుగా కనబడునట్లు ఒక్కఁడవేయయ్యు జగాలను పలురూపములుగా తోచెదవు. నీకును స్థూలసూక్ష్మ జడరూపములకు నెట్టి భేదములేదు. నీ కరుణవల్ల సర్వము గంటిని. ఈ విశ్వరూపమును జాలింపుము"

ఈ సందర్భమున కవి 'సచ్చిదానంద భాస్వత్సుధాంభోరాశి హంసాయ మదన విధ్వంసకాయ...' (2-79) ఇత్యాదులను, వీరభద్రవిజయాది కావ్యములను తలపింపజేయుచు రచించినాడు.

గర్భోత్పత్త్యాది కథనము : ఈభాగమున లింగదేహమున ఈ శరీర మెట్లు జనించునో వివరింపబడినది. భూమ్యాది పంచభూతములచే ఈశరీర మేర్పడును. శుక్లశోణితజనిత మయినది జరాయుజ మనబడును. 'ఋతుదినమ్ముల వీర్యమ్ము సతుల గర్భగోళమున దద్రజమ్ముతో గూడికొన్న-అదె జరాయుజ మగు'. వీర్యమధికమయిన మగశిశువు. శోణిత మెక్కుడైన ఆడుబిడ్డ. సరిసమానమయిన షండపిండము.

'ఋతుమతియైనది మొదలుగ
నతివకు ఋతువనిరి షోడశాహస్సులు నా
ఋతుదినముల బేసిని సరిఁ
బతి గలియన్బడయుఁ బడతి పడతిం బురుషున్' (2-93)

స్త్రీ ఋతుమతియైన పిమ్మట స్నానముచేసి కాంక్షితమతితో ఎవని మోము చూచిన అతనికి తగురూపసి పుట్టును. కాన ఆమె ప్రేమతో పతిమోము చూడవలెను. ఇచ్చటనే భార్యతో కలిసిన దినమును బట్టి కలుగబోవు సంతానపు గుణగణములు వివరింపబడినవి.

పుట్టబోవు శిశువును గూర్చి తెలిసికొనుటకు సూచన :-
'జనని గర్భమందు జలియించుబిండమ్ము, దక్షిణాశయమందుఁ దనుభవుండు
తనయయేని యెడమ నొనరమెలగు; నపుం, సకము మధ్యమం దెసంగుచుండు
(2-104)

చూలాలికి స్థిరభావము లుద్భవిల్లిన పురుషుడు, చలనము, చపలత కలిగిన స్త్రీ శిశువు. రెండును మిశ్రమమైన నపుంసకుడు. స్త్రీకి కోరిక లెట్లుండునో అట్లే, శిశువు గుణములు, నడతలు ఉండును. కాన చూలాలిస్వాంతమున గల్గు కోరికలు దీర్చుట యుత్తమము. ఎంతకాలము కఫవాతపిత్తాలి కప్పబడియుండునో అంతదనుక నెద సుషుమ్ననాడి నుండి 'పోడిమినుడి' వెల్వడదు. కావుననే గర్భశిశువు రోదనము చేయజాలదు. గర్భనరకమునకంటె మించిన నరకములేదు. కర్మవశమున పాంచభౌతికముగా పుట్టిన శరీరము మఱల వానియందే లయించుచున్నది. పుట్టునది ఒక్కడే. అంతమొందునది తానొక్కడే !

శరీరనిరూపణము : తల్లిదండ్రులు దిను అన్నమువలన శరీరనిర్మాణము జరుగును. జ్ఞానేంద్రియములైదు, కర్మేంద్రియములైదు. మనసు, అహంకృతి, మతి, చిత్తము. అను నాల్గు అంతరింద్రియములు. నిశ్చయాత్మకమయినది బుద్ధి. కోరినట్లు చేయునది చిత్తము. 'నేను' అనుటయే అహంకారము. ప్రాణాపానవ్యానోదాన సమానము లనెడి పంచమహావాయువులలో ప్రాణవాయువు ముఖ్యము. ఇది నాభి మొదలు కంఠమువరకు ప్రవర్తిల్లుచు, నాసికారంధ్రములనుండి నాభీకుహరమునకు, హృదయమునకు తిరుగుచుండును. పల్కుటకు, ఉచ్ఛ్వాసనిశ్వాసములకు నిదియే ముఖ్యాధారము.

ఈభాగమునందే ఆకాశాదులవలన జీవికేర్పడు అంగములు, గుణములు వివరింపబడినవి. రక్తమాంసాదులతో ఉండు నీ శరీరమునుగూర్చి యోచించిన ఇంతకంటె హేయమైన పదార్థము మరొకటి లేదు. కాన దీనిమీఁది మోహము వీడవలెను.

జీవస్వరూప నిరూపణము : ప్రతిబింబరూపు డయిన జీవుని తెలియుటకు మొదట బింబరూపు డగు బ్రహ్మము నెఱుగవలెను. సర్వభూతములందు అగోచరమగు పరమాత్మ బ్రహ్మజ్ఞాన సంపన్నుల సూక్ష్మబుద్ధిచే చూడబడును. మలినమయిన అద్దము వలన ముఖము మఱికిగా కనబడునట్లు, చంచలమైన అహంకరణ దోషసంచయమున ఆత్మకూడ దోషసమన్వితముగా దోచును. ఆత్మాంతఃకరణసంయోగమువలనను, తాదాత్మ్య-అధ్యాసనమ్ములబట్టియు ఐక్యాభిమానమై పరమాత్మాంశుడైన జీవుడుసుఖదుఃఖము లందుచున్నట్లుండును కాని అతని కేమియును లేవు. ఎండమావులలోని నీటివలె జ్ఞానశూన్యుల కాత్మదోషమువలన కర్తృత్వభోక్తృత్వ దోషబుద్ధి తోచును.

శరీరమున గల 72వేల నరములలో 101 ముఖ్యము. వానిలో ఒకటి తలదాక వ్యాప్తమైయుండును; అదే సుషుమ్న. అదియే అనంతకర్మఫల మనుభవించును. 'అసుషుమ్నముస్నైన బోనాడు వాడు కేవలానందమూర్తి. ముక్తిరమ గాంచు. తన్నివాసాభివృద్ధిచైతన్యరూపమునె మునులు జీవు'డనిరి.

'జలముల దెచ్చుమృత్కలశసంఘముతోడ నభంబువచ్చున
ట్టులు కనుపట్టు, సర్వగతుడుం బరిపూర్ణుడునైన యాత్ముడున్
దొలగగ లింగదేహమును తో నెబయల్పడినట్లుతోచు ని
శ్చలుడు తదాత్ము డెక్కరణి చంచలతన్ వహియించు రాఘవా' (3-31)

అని శంకరుడు ప్రశ్నించును.

లింగకాయము ముక్తి పొందువరకు కర్మములను బట్టి, ఫలము ననుభవించుటకు కోర్కెలు పుట్టును. 'ఆత్మవిజ్ఞానమున అవిద్య నశించగా తోచు తనస్వరూపమును బొందుటే మోక్షము'. ఘటములో కనిపించు ఆకాశము ఆఘటవినాశములో స్వరూపముతో కూడు విధముగా తనువు విడిచి జీవు డొప్పును. గారడీవలె వాసనాకారణమున బుద్ధిమొదలైన కరణములు కర్మవలన గనుచు తనకు తానే సాక్షీ మాత్రుడుగ నుండును. 'అంతఃకరణాదుల సంస్కారమువలన దోచెడి జీవుడు' వాసనాత్మకుడు. వానికి పరమాత్ము డొక్కడే సాక్షి. పసితనమున పొందు అవస్థలు జీవుడు గతజన్మ వాసనలచే పొందిన ఫలములు. ముక్తిరమను పొందగోరెడివాడు - మన్మథకేళిలో స్వాంతమున బాహ్యసంగతులను పరిగణింపని స్త్రీవలె ప్రపంచ సుఖాదులను లెక్క చేయడు. (సలిల సంపూర్ణకుంభి మాజలధి మగ్నమయ్యు నానీటితోడనె నదియు లేవనెత్తబడినట్లు) జీవాత్ముడు కారణాత్మను విడిచి కాయమున కెత్తివచ్చును. ఏకాకారుడయిన సూర్యుడు తటాకాదులం దాకారంబు లనేకమై ఒప్పుచు ప్రకాశించునట్లు కూటస్థుడు నిర్వికారుడయి ఎంతో వికారముగా వచ్చుచు పోవుచున్నట్లు కన్పించును. ఆత్ముడు స్వయంప్రకాశుడయ్యును మోహపరవశుడై బ్రహ్మకంటె వేఱయి చెడుచున్నాడు.

ఉపాసనామాహాత్మ్యము : పండినపండ్లు చెట్టునుండి భూమిపై పడు

నట్లు హృదయమను గుహాయం దుండిన లింగకాయము నశించును. నరుడు చేసిన పాపములనుబట్టి యమభటాళిచే బంధితుడై యాతనాశరీరమున బాధలు పడును.

ఈ విభాగమున్న జీవు డేయే లోకములలో ఎంతకాలముండునో వివరింపబడినది. కర్మఫలముచే రౌరవాదినరకము లనుభవించి పిపీలికాది నీచజంతువులుగా పుట్టును. ఆత్మజ్ఞానము గడించిన ఆత్మైకత్వవిజ్ఞుడైనగాని విముక్తి కలుగదు.

ఉపాసనావిధి : ఇది నాల్గు విధములు. 'అలతివస్తువు గని వలతి యనుట— మన సనంతమయినదని యుపాసనసేత—' సంపద విధి. 'కాయముపయి నారోపణ సేయువిధము—' ఆరోపవిధి. 'ధీపూర్వకముగ నారోపణ సేయుట'— అధ్యాస. 'ఎల్లన్ స్వవశమ్ము సేసి కొనుట'— సంవర్గము.

గురువు బోధించువిధిని దేవతకు, తనకు, అంతరము లేనివిధముగా దేవతాత్వ మొందుట అంతర్గతము. దానికి వేరయినది బహిర్గతము.

'పెఱతెలివిచేత గప్పంగ బీలుపడని, దైన జాతిలోగూడిన జ్ఞానవికతి, నయ్యుపాసనాదేవతైక్య మొందు, టే యుపాసన మన జెల్లు'ను. ఎచటచిత్తము లగ్నమగునో అచట ఉపాసన చేయవలయును.

హృదయ మొక మాయలాడి. దానిని తెలివిగా నడపవలెను. లేనిచో నూతున కవశమ్మైన దుష్టతురంగములట్లు ఇంద్రియములు సంచరించును. ఇంద్రియము లను గుఱ్ఱముల పగ్గములబట్టి సమాధిహృదితో తనూరథమును బ్రవర్తిల్లఁ జేయగల సంయమి శక్తుడే ముక్తుడు.

ఓంకారమున సుజ్ఞానము బొంది ఈశ్వరుని గనవచ్చును. మూడవస్థల వెలుగొందు భోగ్యభోక్తృభోగములకు సర్వసాక్షియే ఈశుడు, పరమాత్ముడు.

మోక్షయోగము : నన్ను నిష్కామహృదిని పూజచేసి నాలోకమున ఇష్టకామ్యంబులు, సమానలోకము చెందియుండుట సాలోక్యము. నన్ను తెలిసికొని కోర్కెలు నశింప జేసికొని నాతోసమానరూప మంది నాలోకసంవాసుడౌట సారూప్యము. సత్కార్యములుచేసి శివార్పణ మని భోగము దానము హోమ తపఃఫలము నాకిడుచు సుప్త విధవములంగుట — సార్ష్ట్యము — శాంతి దాంతి గుణాళి కలవాడే అద్వైత మహాకైవల్యము బ్రహ్మైక్యము నొందును.

'అవివేక మనిరొమ్మడి హృద్గ్రంథిమోచనం'బె మోక్షము. జ్ఞాని 'క్షీరములనుండి త్రచ్చుచో వేఱుపడ్డ, వెన్న యాపాల గలియని తెన్నుగానె' సంసార మంటియుండియు అంటకయుండును. అని శంకరుడు రామునకు చెప్పెను.

పంచకోశోపాసనము : మొదట అరుంధతిని చూపునట్లు సగుణోపాసనచేత, చేతసమున కేకాగ్రత నేర్పి వానియందే మనస్సును నడుపవలెను.

మూసలోనున్న బంగారమువలె ప్రాణమయకోశముండును. అన్నమయకోశమందున్నది ఆత్మకాదుకాని క్షుత్పిపాసాపీడకర జడము. మిక్కిలి జ్ఞానమొందిన ఆత్మ

చేనినిజమానసముచందు వీక్షితమగుశో ఆతడె శోకదూరుడై పరబ్రహ్మమై ప్రకాశించును. పరబ్రహ్మరూపునకు దేనికేనియు భోగ్యముకానిచో ఆతనికేదియు భోజ్యము కాదు. అట్టి ప్రాణమయకోశమున మనోమయకోశము ప్రకాశమొందును. అది బుద్ధీంద్రియాన్వితమయి వికల్పములను, సంకల్పములను కలిగియుండును. విజ్ఞానమయకోశమున సకలనిగమశాస్త్రసంచయ నిశ్చితమయి కర్మవిషయ ప్రవర్తిగా ప్రకాశించు బుద్ధి జ్ఞానేంద్రియములతో పుట్టును. అట్టికోశమున 'కర్తృతాభిమానైహికాముష్మికాది గతుల నలరుహాడే జీవు' డని చెప్పబడును.

లింగకాయము కాల్పబడిన యినుప గుండువలె ఎల్లప్పుడు పరస్పరాధ్యాసయోగవిరాజితముగ సాక్షిచైతన్యయుక్త డగును. అదియే ఆనందమయకోశము. అది ఇహపరములయందు విద్యాకర్మఫలాదిరూప మగు సమస్తభోక్తృత్వమును పొందు ఫలభోక్త. అది ఎప్పుడు సుప్తియందు బింబ స్వరూపమున ఉండునో అప్పుడు విద్యామాత్రముతో గూడి సాక్షి యగుచున్నది. అరటిచెట్టుదొప్ప లొక్కొక్కటి లాగి తరువాత తత్సారము ప్రీతితో కైకొనునట్లుగా అన్నమయాదికోశములను నిరాకరణ మొనర్చి తత్సారమును ఆత్మ సంగ్రహించును. శ్రుతివేత్త మనస్సును నియమసమాధి నిల్పి నిరాకార నిర్గుణంబైన బ్రహ్మమునందు చిత్తము నడిపించి మనస్సున కగోచరమగు ఆపరమాత్మయందైక్యము నొందును.

'ఏయదియీవొనర్చెదవొ యేమిభజింతువొ, యొద్దివేల్తువో, యీయగడంగు దానము తపించెడి యత్తపమెద్దొ యన్నిటిన్, జేయుము నాక యర్పణ ప్రసిద్ధిగ దద్దయు శుద్ధబుద్ధివై (4-40) అని పల్కిన ఈశ్వరుని పల్కులు భగవద్గీతోపదేశమును తలపించును.

భక్తియోగము : ఇందు శివున కెవనియం దిష్టముండునో వివరింపబడినది.

'సత మేవాడుపఠించు భక్తిమెయి శశ్వద్రుద్రసూక్తమ్ము శ్రే
ష్ఠతరాథర్వశిరమ్ము ముక్త్యుపనిషత్సారోరుసూక్తమ్ము స
న్నతిశ్వేతాశ్వతరమ్ము నాతడె నిజాంగమ్మందు వెల్గొందు శ్రీ
శితి కంఠుండయి వానికంటె గలదే చింతింప భక్తుండిలన్' (4-48)

అకార, ఉకార, మకారములతో కూడిన అర్ధమాత్రగల ఓంకారమునకు అధిష్ఠానదేవతలు చెప్పబడిరి.

ప్రణవమే అంగజారి. కాన ప్రణవజపపరాయణుడు పరమనుండుట నిశ్చయము.

మోక్షాధికారి నిరూపణము : చతుర్విధజాతులలో స్త్రీ పురుషులెవ్వరేని మోక్షమున కర్హులు. ధ్యానయోగికి దేశకాలపాత్రల నియమములు లేవు. ఆతనికి ముక్తి కరతలామలకము. ఇందు సాయుజ్యమొందుమార్గము లుపదేశింపబడినవి.

పూజావిధానము : మన్ను, చందనము, ఇసుక, గోమయము, భస్మము మున్నగువానితో లింగరూపముచేసి కొల్చిన అబ్బు ఫలములు, ఏఏవిగ్రహముల రూపమున కొలిచిన మోక్షమబ్బునో అనునది, ఈ విభాగమున వివరింపబడినవి.

జపలక్షణము : స్ఫటికమాల సామ్రాజ్యము, పుత్రజీవనమున సిరులు, నిచ్చును. రుద్రాక్ష సర్వకామ్యముల నొసంగును. ఇట్లే మిగిలినవాటి ఫలములు చెప్ప బడినవి. 108 గల హారము ఉత్తమోత్తమము. శతకము ఉత్తమము. 50, 54 మధ్యమములు.

అ మొదలు క్ష వరకు అనులోమ విలోమమ్ములతో జపము చేయవలెను. జప మాలను ఒరులకు కనిపింప చేయతగదు. 'సవ్యహస్తంబు గుదమందు స్థాపనంబు సేసి మగుడి నసుప దక్షిణకరమ్ము, యోనిముద్రయనంగ కెన్నొందునిదియె, యుర్వినాస నమ్ములలోన నుత్తమమ్ము' (4-127)

'జను డెవడు యోనిముద్రా
సన సంస్థితుడై జపమ్ము సల్పునో మహిలో
ననువుగ వాడే మంత్ర
మ్మును జప మొనరింప సిద్ధిబొందు ద్వరగతిన్' (4-128)

ఈవిధముగా శివగీతను వీరభద్రకవిగారు అనువదించినారు. ఇందలి ఆధ్యాత్మిక విషయము లనన్యసామాన్యములు. (సశేషము)

---

( 12 వ పేజీ తరువాయి )

పేరువున్నాయి. దీన్ని వ్యత్యయంచేస్తే బాగుండేదేమో ? పుస్తకం వెనుక కవిగారి వివరాలు రచనల వివరాలు వున్నాయి. ప్రాచీనకవులుచేసిన అవతారికల్ని విమర్శించి యెట్టెట్టుగా వున్నా యనే యీరోజుల్లో యీవివరణాలుండడం విచిత్రమేమో ? నిశాంతం కవిగారి యేకైక పద్యకావ్యం అనివేశారు. (వెనుకపేజీపై) అంటే వారి అభిప్రాయంలో ఒకేఒక పద్యకావ్యం అనేమో ? ఒకేఒక అనేభాగాన్ని సంస్కృతంలోకి అనువాదంచేసే వచ్చే చిక్కు యిదే. 'ఏకైక' పదానికి 'ఒక్కొక్క' అని అర్థంవస్తుంది. కవిగారింకా పద్యకావ్యాలు వ్రాయ రని వారికి తెలుసా లేక అదేమైనా నియమమా ?

గ్రంథం చేసినంత సహాయం పీఠిక చేయదు. కావ్యం చాలా మనోహరమైనది. ఈరకంగా ఆలోచించి రచనచేసే కవులు మనదేశంలో చాలా తక్కువమంది. ఇట్టి కవిత్వాలు ప్రచారంలోకి రావడం సమాజానికి మిక్కిలి యుపకారకము.

కవిగారు అవతారికలో గ్రంథాన్ని గురించి సంగ్రహంగా చక్కగా వివరించినారు. నిశాంతం అనే పదానికి గృహము అను అర్థము (నితరాంశామ్యతి దుఃఖాదిక మత్ర) చెప్పినను దేహాన్ని యిల్లుగా, మనస్సునో లేక చిత్తమునో బుద్ధినో గృహస్థుగాచేసి తన అనుభవాలని వివరించినట్లుగా భావించవచ్చును.

శ్రీ సుదర్శనంగా రిటువంటి రచన లనేకంగా పాఠకలోకాని కందించగల రని పాఠకు లాశింపవచ్చును. ఉత్తమలక్షణములు కరడుగట్టిన యిలాటిరచనల సముదాయం నేటి పాఠకులకు మిక్కిలి అవసరమై యున్నది. *

# పృథ్వీసూక్తము

— శ్రీ జమదగ్ని, ఎం. ఏ.

( 8 వ సంచిక తరువాయి )

౧౬ ఎంతభిన్నతనైన నేకత్వమే కాంచు
వింత సత్యజ్ఞాన వేదులౌ భారతులు
సుంత భ్రాంతిని గనరు చొక్కుదగు పరమార్థ
చింతనమ్మునఁ జేసి చిత్స్వరూపము తెలిసి॥.

౧౭ చీమ యేనుఁగయు నక్క చిఱుతపులి సింహమ్ము
దోమ డేగయు చిలుక తోడుగల జీవాళి
గ్రై మహింగల చేతనాచేతనము లన్ని
యా మహాత్ముఁడె కాక యన్యుఁ డొక్కండున్నె ?

౧౮ ఆయినప్పు డవనిలో నమరులౌ మానవులు
వేయి విధంబుల భిన్నవృత్తి పొలుగుటేల ?
పయికి కానగవచ్చు వైవిధ్య మడిగించి
కయికొనం గారాదె కైవల్య మార్గమ్ము॥.

౧౯ పుడమి తత్త్వము పట్టి పొడచూపు నుడులెల్ల
నుడుల భేదముబట్టి మతముల భేదము గల్గు
మడిమడికి భిన్నమై మనుచుండు టేకాక
యెడదలో నేకమై యెప్పు డొక్కండుండు !

౨౦ ఈ హేతువున కాక యెవ్వఁ డింకొకనికై
బాహాటముగ త్యాగ పద్ధతిం బడఁజాలు
ఓహో మహాసృష్టి నుద్భూతుఁడైనాఁడు
దేహమును తాల్చి యాదేవుండె నరుఁడౌచు॥.

౨౧ జగమెల్ల దేవుఁడే జడము నజడం బౌను
తెగలు తెగలుగ నున్న జగమంతు జడమెల్ల
తెగుటతో తెంచుటన్ తెగ అంటయేకాని
తెగలున్నవే లోఁతు దిగిచూడ జగములను ॥,

౨౨ అయిన భాషనుబట్టి యాయాయి గుంపులై
వేయి విధంబుల వేరు వేరు తీరులు గాగ
సయిదోడు లనక వైషమ్యమ్ము వహియింత్రు
మెయి రంగులనుబట్టి మేకొంద్రు వైరమ్ము !

౨౩ భావరాయొక్కటి యయ్యు పరిధి తగ్గనయంత
వేషమ్ము మారి వేర్వేరుగా కనిపించు
వేషమ్ములోననే భేదముండునుగాని
వేషమ్ములో లేదు శితదృష్టి పరికింపు॥.

౨౪ మడిబట్టి నుడివచ్చి, నుడిబట్టి భావంబు
పొడసూపి, నడిపింప నడచునీ భేదంబు
అడుగడుగునకు వాని కగుపించు భేదంబు
నడగించి నూటిగా నడచి పోవగవలయు॥.

౨౫ అయిన స్వార్థంబుచే నందరును భిన్నులై
చెయిదాటిపోవగా చెడిపోవు చుండెదరు
గోయిననున్నవాని మిక్కుటమైన స్వార్థాన
పయికెక్కిదివి నంది స్వాత్మసౌఖ్యమునందు॥.

౨౬ స్వార్థార్థమెది యన్న స్వస్వ స్వరూప సా
వ్యర్థమ్ము దైహిక స్వార్థంబు మనుజాలకు
సార్థకత పొందగా జనకుఁ డంతట నుండి
యర్థమ్ము నెఱుఁగ వైయర్థ్యమ్ము కల్పించు॥.

౨౭ అమ్మతా నయ్యయే యయ్యు మాయగ తోచి
బొమ్మలం జేసి నైపుణ్యాన కదలించి
దిమ్మ దిరుగగ త్రిప్పి తెలివి పుట్టఁగ జేసి
యిమ్ముగా నెఱిఁగించు నెదలోని సత్యమ్ము॥.

౨౮ ఆ సత్య మెఱిఁగింప నమ్మ వివిధమ్ముగా
దేశభేదమునంది తెగినట్లు కనిపించి
దేశదేశములందు తెగలెన్నొ కల్పించి
వీసమైనను భేద విధి చూపు సర్వాన॥.

౨౯ జంగమము భిన్నమ్ము స్థావరము భిన్నమ్ము
అంగాంగమును భిన్న మణువణువు భిన్నమ్ము
సాంగత్య మంది యీ సర్వంబు నుండుటే
అంగీకృతిం గూర్చు నాత్మసత్తను మీకు॥.

౩౦ అణువణువు భిన్నమై గుణభేదమును పొంది
గుణభిన్నతను బట్టి కోటిరూపాలంది
కొనబడున్న మనకల్లి మనకు మనుగడ లేదు
మనకోసమే యింత మమత తా నొలికించు॥.

౩౧ సమతయే యుండి వైషమ్యమే లేకున్న .. ..
అనురునే తిండి యీ యఖిల జీవావళికి
అమృతుండై జీవుండు సమతనందుట కొఱకె
విమతి జీవుల మెక్కి వెలుఁగొందు నీ నేల॥

౩౨ మనుజుండే కాదహో మన్నంతరయున్ గూడ
నణువణువు జీవుండేయగును జడతను పొంది
కనును చేతనతయున్ క్రమముగా పరిణామ
మునుపొంది చిన్మాత్ర తను గాంచు కేవలత॥

౩౩ మడు లెన్ని యున్నవో నుడు లన్ని యున్న వా
నుడులన్ని యొక్క పెన్నుడినుండి పొడమినవి
పుడమి పుట్టక యద్ది పొటమరించెను మింట !
బడుగులై మానవులు పరిభవింతురె దాని ?

౩౪ ప్రాజ్ఞు లద్దాని గీర్వాణ వాణిగ నెఱిఁగి
అజ్ఞానములు వీడి విజ్ఞానులైనారు
యజ్ఞయాగాదు లౌ నఖిల కర్మలు దాని
సుజ్ఞాన మహిమచే సుఖపెట్టె నీ నేల॥

౩౫ ఆదిజుండౌ బ్రహ్మ కంతరంగము నందు
వేదములు స్ఫురియించె వేద వేద్యుని మహిమ
వాదనముచేసె నా బ్రహ్మ యవ్వేదముల
నీగినముదాక నవియొప్పుడును శ్రుతములే !

౩౬ శ్రౌతవాణిని బుధులు సంస్కరించుటఁ జేసి
ఆ తల్లి సంస్కృతం బను పేర భువినున్న
యే తల్లికిన్ దల్లి యే యాచు నున్న దని
లోతు తెలిసినవారు బ్రాతిగా నెఱుఁగుదురు॥

౩౭ సకలమౌ భాషలకు సంస్కృతమె తల్లి యా
ప్రకటనకు హేతువై భాష లుత్పన్న మౌ
నికటమున నెల్లరును నిలిచి మనసులు కలిసి
ప్రకటితాశేష వైభవ మందగాఁ జేయు॥

౩౮ ఆ పుడమి యానాఁటియు నమ్మలై యున్నారు
ఏపు నందగ నరుల కీ యమ్మలే దిక్కు
చేపట్టరే తల్లి శ్రీపదము లింకైన
కాపురములో నిత్యకల్యాణ మందంగ॥

౩౯ ఎటఁబుట్టు వాని కచ్చటఁబుట్టు నుడితల్లి
నిటలాన విజ్ఞాన నేత్రమ్ము మొలిపించు
కిటు కెఱుంగక తల్లి ఖేదమ్ము గనవీడి
పటువంచు పెగచోటి భాష పట్టగరాదు॥

౪౦ తనకన్న తల్లికా ఘనుఁడొనర్చిన ద్రోహ
మునుజూచి సవతమ్మ మోదమ్ము కనఁబోదు
తన బిడ్డలకు నిచ్చుచనవు నెన్నఁడు నీదు
కనఁజాలఁడీ ఘనుఁడు కనువిప్పు నామెకడ !

౪౧ తనధర్మమున తాను తనువు విడనాడుటయె
ఘనమంచు నుడివె చిద్ఘనుఁడు శ్రీకృష్ణుండు
తన పుట్టుచోట క్రొన్ననగాగ ప్రభవించు
తెనుఁగే స్వధర్మమ్ము తెనుఁగు జాతికి నెల్ల

౪౨ తెనుఁగు తెలుఁగన్న తేలికగ భావించి
తననాడు నేల వచ్చిన వారి నాడులను
జనియించు భాషలను చదివి బుద్ధులుమారి
పెనుదుఃఖమును పొందు భీతమతులను గనుఁడు !

౪౩ పరధర్మ మెల్లపుడు పరమభయ హేతువని
యెరిగించెగా మనకు నీశ్వరేశ్వరుఁ డపుడు
ఎరిగెరిగి పెరనుడుల కేల వెంపరలాడ
ఎరుగరే మీ తెలుఁగదెంత గొప్పదియౌనొ ?

౪౪ సర్వం సహాచక్ర సర్వస్వ మందునను
పూర్వమే శ్రేష్ఠమని పూర్వులేకాదయా
సర్వులున్ దెలిసి తత్సరణి పోవగవలయు
పూర్వభాగమునందె పొడముగా సూర్యుండు !

౪౫ ప్రాగ్దిచటఁబుట్టునో పుట్టునచ్చోటనే
మొద్దునిద్దురలేపు మొదటి వెల్గులు గాన
పెద్ద ప్రాగ్దేశమే పెరదేశముల కంటె
కొద్దిగా తలపోసి కోరుదురె చీకట్లు ?

౪౬ ఆ పూర్వభాగాన నధికమ్ము భారతము
లేతబుద్ధులు దాని లేకితనముకు జూడ
తాతతాతలనాటి తత్త్వమ్ము నెఱుఁగకే
ఆ తప్పుదారి తామరుగు టెట్లగు నొప్పు ?

౪౭ భారతము నందున్న ప్రజలు భారతిఁగొల్చి
పేరుగాంచిరి మున్ను విశ్వగురువులు గాగ
భారతిని సంస్కృతిని వదలి యీనాఁడేమొ
చేరి శిష్యులుగాగ చెడుచుంటఁ గనరేమి ?

౪౮ భారతింగల సద్భావములందునఁ గూడ
నేరీతిగాఁ జూడ నీ తెలుంగే గొప్ప
గౌరవము గొనె మున్ను గౌరవింతురు నేఁడు
వారు వీరన నేల పరమార్థ మిది తెలుము॥.

౪౯ సారభూతంబైన సంస్కృతముగల భాష
చేరి విజ్ఞానమ్ము చెందింపఁ గలభాష
కోరి మక్కువ పెంచు గుణగణము గలభాష
శ్రీ రాజరాజేశ్వరీదేవి తెలుఁగహో !

౫౦ గీతమ్ము గావించు గానలింగ మ్మును
దాశరథి కృతి నిజాంపు తత్పరుఁడు గీతమా
ఈ నేల లింగత్రయిం బొంది రూఢమై
లీనమ్ము చేయున్ త్రింగంబుగా నుండు॥.

౫౧ శ్రీశైలకాళేశ శివులు దక్షారామ
శ్రీ శివునితోఁగూడి సిద్ధులైయున్నారు
ఆ శివుల కాధారమైయున్న యీగడ్డ
యే శివారూపం బిదే శైవసారమ్ము !

౫౨ భ్రమరాంబికా చలత్ భ్రమరంబు డెందాన
నమరించికొని కులుకు నా మల్లికార్జునుఁడు
శివలింగములు తామె తారుమారొనరించి
విమృశింప స్త్రీ పురుష భేదమే లేదంద్రు॥.

౫౩ దక్షవాటీవాసి శిక్షకుఁడు రక్షకుఁడు
రూక్షేక్షణుం డెంతొ క్రూరులౌ వారలకు
అక్షయ్య మైశ్వర్య మందించు శిష్టులకు
నిక్షిప్త ధనము మాణిక్యాంబ సఖ్యులకు॥.

౫౪ చేరి మాడగరాని చీకట్ల కోనలో
నేరికిని భీతిలక యోగి సేవించుచో
నీరేడు భువనాల కేలికను చేయు దయ
పేరు కాళేశుఁడై వేరుపడియున్నాఁడు॥.

# (ఎన్నికల) సంగ్రామానంతర పరిస్థితి

ఆంధ్ర కర్ణాటాది రాష్ట్రముల ఎన్నికల ఫలితాలు అందరినీ చకితులను చేసినవి. ఊహాతీతమయిన పరిణామాలు కలిగినవి. గెలుపోటములకు కారణములను గూర్చి తర్జనభర్జనలు చెలరేగినవి. అత్యధిక మెజారిటీ సంపాదించిన ఆంధ్ర కర్ణాటక రాష్ట్ర రాజకీయ పార్టీల శాసనసభాపార్టీ నాయకుల ఎన్నిక అనంతరము నిరాలస్యముగా మంత్రివర్గసభ్యుల జాబితా ప్రకటితము కాలేదను సంగతి విచిత్రము.

గెలిచినపార్టీలలోను ఓడినపార్టీలలోను ఏకాశయసిద్ధి మృగ్యమని దీనివలన తేలుచున్నది. ఆంధ్రప్రదేశమంత్రి వర్గనిర్మాణముపై ద్వివిధాభిప్రాయములు వెల్లడియగుచున్నవి. వ్యక్తుల సామర్థ్యాసామర్థ్యముల నిర్ణయమునకు సరియైన కొలబద్ద లేదు. ఉన్నంతవఱకైన అది తూచా తప్పకుండ ఉపయోగింపబడిన దని భావించుటకును బలమైన ఆధారము కనబడదు. ఒకే విధముగా ఎన్నుకొనబడిన ప్రతినిధులకు మంత్రివర్గమున స్థాయీభేదము కల్పింపకుండ ఏకస్థాయి కల్పించుటొకపుడు చక్కగా బనిచేసిన సంగతి విస్మరింపక పాటించియుండిన మేలుగా నుండెడిది. వ్యక్తులను బట్టి, వారికీయబడిన శాఖలనుబట్టి నూటికి నూరుపాళ్ళు ఉత్తమ పరిపాలన కొనసాగగలదని గతానుభవమునుబట్టి పూర్తిగా విశ్వసింపలేము. చిత్తశుద్ధి, సమదృష్టి, విశాలభావము, ఎంతవఱకు ఆచరణకు సన్నిహితముగ నుండగలవో వేచి చూడవలసియున్నది.

కేంద్రములో అధికారమునగల పార్టీ రాష్ట్రములలో తృప్తికరమైన బలము సంపాదింపలేకపోవుటకు అన్ని దశలలోనూ ఆపార్టీ కృషిసమగ్రతాలోపమే కారణ మనక తప్పదు. ఇతర పక్షములకు స్వార్థపరత్వముతో ద్రోహము చేసినవారికి తమపార్టీ ద్వారములను వివేచనా రహితముగా తెఱచియుంచుట, వారి బలముపై నాధారపడుట, రాజనీతి విశారదతను సూచింపవు.

అట్టి సముచితము కానిచర్యలవలన నిజముగా గెలుపే సంభవించినను అది రాజకీయ పక్షపాతరహిత యథార్థ ప్రజాస్వామిక హృదయములకు హర్షదాయకము కాజాలదు.

ఓడినపార్టీ సభ్యులు గెలిచిన పార్టీలవంకకు బరుగులెత్తుట సముచితముగా లేదు. అందుకు గారణము ప్రజాభిప్రాయమును మన్నించుటయే యని వివరింపబూనుట ఆత్మవంచనయే యగును. తాము కొన్ని అభిప్రాయములను మంచివిగా ఎలెక్షను ముందువఱకు భావించియుండినవారు భిన్నమైన ప్రజాభిప్రాయ ప్రవాహములో కొట్టుకొనిపోవుటయే విధిగా నెంచరాదు. తాము మంచివని భావించిన ఆశయములవంకకు ప్రజాభిప్రాయమును మరలించుటకు సర్వశక్తుల కృషిచేయవలసిన ధర్మము తమపైనున్నదనికూడ గ్రహింపవలెను.

అట్లు పార్టీని విడిచి వచ్చువారిని స్వీకరించుపార్టీలు అట్లు వచ్చువారిని కనీస మైదేండ్లవఱకు పార్టీగతముగా ఏ ఉన్నతప్రభుత్వ పదవులు నొసగని స్పష్టమైన షరతుతో మాత్రమే చేర్చుకొనవగును. ప్రభుత్వపదవులే ప్రజాసేవకు ఏకైక మార్గమనే భావనను ప్రోదిసేయరాదు. ఈవిషయమున కాంగ్రెస్ (ఐ) కొంతవఱకు చూపుచున్న నిగ్రహము ప్రశంసనీయము. అన్నిపార్టీలు కొంతకాలము పదవులాసింపని ప్రజాసేవా పరాయణతకు సంసిద్ధములై యుండునపుడు దేశశ్రేయస్సునకు పునాదులు వేసిన ట్లగును. —సంపాదకుడు.

—♦—

# ఈ పక్షంలో

## సాహిత్య సభ

ఈ నెల 7వ తేదీ మహాశివరాత్రినాడు ఉదయం 11 గం॥లకు రాజమండ్రి ఆంధ్ర కేసరి యువజనసమితి కార్యాలయంలో సాహిత్యసభ జరగినది. సభకు సమితి ప్రెసిడెంటు శ్రీ ఎం. చిరంజీవి అధ్యక్షత వహించిరి.

ప్రసిద్ధ నవలారచయిత్రి శ్రీమతి డా. సి. ఆనందారామం రచనావిధానాన్ని గూర్చి ప్రసంగించినారు. సమాజం రచనలలో ప్రతిబింబించాలి కాని యథాతథంగా సమాజాన్ని రచనలో చిత్రించడం సముచితం కాదనిరి. వాస్తవికతకు కళాత్మకమైన కల్పన జోడించవలెనన్నారు. సమాజంలో పరివర్తన లేనిదే కేవల ఉద్రేకపూరిత రచనలవల్లా ఉద్యమాలవల్లా తగిన ప్రయోజనం ఉండదన్నారు.

6వ తేదీ సాయంకాలం ప్రభుత్వకళాశాలలో రాజమండ్రి ట్రయినింగు కాలేజీ ప్రిన్సిపాలు శ్రీ ఆర్. కృష్ణమూర్తి అధ్యక్షతను జరగిన వార్షికసభలోను శ్రీమతి ఆనందారామం ప్రసంగించారు. సాహిత్య సమాజములను గూర్చి, ప్రాచీనసాహిత్య వైశిష్ట్యమును గూర్చి, ఉపన్యసించినారు. కళాశాలాధ్యక్షులు శ్రీ ఆర్. యస్. సుదర్శనంగారు ఆరంభంలో కళాశాల వార్షిక నివేదిక వివరించారు.

## దైవజ్ఞ భూషణ, పండిత నేమాని శ్రీరామశాస్త్రి సిద్ధాంతి షష్టిపూర్తి మహోత్సవము.

కాకినాడ :

ఇటీవల సుప్రసిద్ధ పంచాంగ కర్తలు దైవజ్ఞ భూషణ, పండిత బిరుదాంకితులు కాకినాడ పురవాసులు శ్రీ నేమాని శ్రీరామశాస్త్రి సిద్ధాంతిగారి షష్టిపూర్తి మహోత్సవము కడువైభవముగ శాస్త్రోక్త పద్ధతిని దేవాలయము వీథిలో వారింట జరిగినది. హోమవ్రత మండపారాధనాదులన్నీ వైదికముగ నిర్వర్తింప బడినవి.

స్థానిక గీతామందిరములో శ్రీ శాస్త్రిగారి షష్టిపూర్తిమహోత్సవమును పురస్కరించుకొని అభినందన సభ, కవిపండిత దైవజ్ఞ పౌరాణిక సన్మానసభ జరగినది.

సభకు శ్రీశ్రీ భాష్యం అప్పలాచార్యులు ఎం.ఏ. అధ్యక్షత వహించిరి. శ్రీ వేదవిద్వత్సభ, వేణుగోపాల సంస్కృతసభ, శ్రీ బ్రాహ్మణ మహాసభ మున్నగు సంస్థలు శ్రీ శాస్త్రిగారికి సన్మానపత్రములు సమర్పించి, చందన పుష్పమాలాదికములతో శ్రీశాస్త్రిగారిని సత్కరించినవి. శ్రీ వెంపరాల సూర్యనారాయణశాస్త్రి శ్రీ జయంతి సూర్యనారాయణశాస్త్రి మున్నగు పదిమంది ప్రముఖ పండితులను శ్రీరామానుజమిశ్ర చింతామణిశాస్త్రి మున్నగు పదిమంది పౌరాణికులను, శ్రీ బులుసు వెంకటేశ్వరులు, శ్రీ దువ్వూరి సూర్యనారాయణ శాస్త్రి మున్నగు ప్రముఖ కవులను, దైవ

(ప్రక్క పుటలో చూడుడు)

## —* రచయితలకు మనవి *—

సంక్షేపముగను, సౌమనస్యముతోఁ గూడినవిగాను, నుండు విమర్శనాత్మక రచనలకు స్వాగతము. గ్రంథవిమర్శకుఁ బ్రాముఖ్యము. ఔచిత్యము మీఱని అభిప్రాయ భేదములకు సముచిత గౌరవము. వాఙ్మయమునఁ జేరఁదగు వివిధాంశములపైఁ మ రచనలు పంపి మాకుఁ జేయూతనీయఁ బ్రార్థన. రచనలు సరళగ్రాంథికములోఁ గాని, శిష్టవ్యావహారికములోఁ గాని యుండవచ్చును.

వివాదాస్పదములుగాని, చట్టబద్ధమైన, మత, రాజకీయ, ఆర్థిక, శాస్త్రీయ, విజ్ఞాన, పారమార్థిక, సాహిత్యాదులకు సంబంధించి వివిధప్రక్రియలకుఁ జెందిన ఏవిషయములమీఁది రచనలనైనఁ బ్రచురించుట మా యభిలాష.

రచన మాకుఁ జేరిన వారమురోజులలోఁ బ్రచురణకు స్వీకరించిన విషయము రచయితలకుఁ దెలుపఁబడును. స్వీకరింపఁబడని రచనలు త్రిప్పిపంపుటకు తగినతపాలా స్టాంపులు రచనలతోపాటు పంపవలయును.

క్రొత్త పుస్తకములను రెవ్యూకి పంపువారు రెండుకాపీలు పంపఁగలరు. పంపఁబడిన ప్రతి పుస్తకముమీఁదను వీలయినంతవఱకు రెవ్యూ ప్రచురింపఁబడును.

— ఎడిటరు.



జ్ఞులను శ్రీ శ్రీరామశాస్త్రిగారు నూతన వస్త్రములతోను, దుశ్శాలువలతోడను కలశములతోను, నగదుతోను పన్నీటి బుడ్లులతోను, చందన సుగంధ ద్రవ్యములతోను, పుష్పమాలలతోను సత్కరించిరి.

మహాకవులు, పండితులు, పౌరాణికులు, దైవజ్ఞులు శ్రీ శాస్త్రిగారి సుగుణ సంపత్తిని, ప్రతిభావిశేషములను గూర్చి ప్రశంసించిరి. శ్రీ కందుకూరి చిన రామచంద్రమూర్తిగారి వందన సమర్పణతో సభ పూర్తియైనది.

—0—

Regd. No. H/Rmy-42. Samalochana 16, March. 1978.



# గ్రంథములు

| | | | |
|---|---|---|---|
| 1) | నిర్వచన మహాభారతము (పదునెనిమిది పర్వములు) | రు. | 50—00 |
| 2) | నిర్వచన అధ్యాత్మ రామాయణము | రు. | 20—00 |
| 3) | నిర్వచన మహాభాగవతము | రు. | 30—00 |
| 4) | శ్రీ వేంకటేశ్వర విజయము | రు. | 25—00 |
| 5) | కుందమాల నాటకము | రు. | 5—00 |
| 6) | వేణీ సంహార నాటకము | రు. | 5—00 |
| 7) | గీత రామాయణము<br>వాల్మీకమునకు గీతములు (అచ్చులో) | | |
| 8) | దేవీ భాగవతము ,, | | |
| 9) | శతక సంపుటములు ఒక్కొక్కటి | రు. | 5—00 |

కృతికర్త : ప్రకాశకుడు :

బులుసు వేంకటేశ్వరులు, ఎం. ఏ.

10-5-5 రామారావుపేట, కాకినాడ-4.

Editor, Printer and Publisher B. Sitharama Sastry, Printed at
B. V. & Co. Press, Innispet, Rajahmundry-1.